# అజపా గాయత్రి

(వివరణ:డి.నారాయణ రావు, విద్యానగర్, హైదరాబాద్, తెలంగాణా రాష్ట్రం)

మనం రోజు చేసే ఉచ్ఛ్వాసనిశ్వాసలు 24 గంటలలో 21,600 పరిమితిగా ఉంటాయి. ఈ ఉచ్ఛ్వాసనిశ్వాసలకు ఏడుగురు అధిష్ఠాన దేవతలుగా పూర్వులు నిర్ణయించారు. వారు వరుసగా 1.గణపతి, 2.బ్రహ్మ, 3.విష్ణువు, 4.శివుడు, 5.జీవాత్మ, 6.పరమాత్మ మరియు 7.గురువు. వీరికి వారి వారికి నిర్ణయించిన ప్రమాణం మేరకు మన ఉచ్ఛ్వాసనిశ్వాసల్ని నివేదిస్తే అది అజపాగాయత్రి (జప రహితమైన గాయత్రి ) అనీ దాని వల్ల గాయత్రి జప పుణ్యఫలం లభిస్తుందనీ పెద్దల ఉవాచ. ప్రయత్న పూర్వకంగా చేసేది గాయత్రి.అప్రయత్నంగా అంటే మన ప్రయత్నం లేకుండా మన ఉచ్ఛ్వాసనిశ్వాసలద్వారా చేసేది అజపాగాయత్రి.

శ్లో॥షట్ శతం గణనాథాయ షట్ సహస్రంతు వేధసే।

షట్ సహస్రంతు హరయే షట్ సహస్రంతు హరాయచ॥

జీవాత్మనే సహస్రంతు సహస్రం గురవే తథా।

చిదాత్మనే సహస్రంచ జపసంఖ్యాన్నివేదయేత్॥

ఉచ్ఛ్వాసనిశ్వాసాత్మకమైన 21,600 సంఖ్యాక అజపాగాయత్రిజపంలో 600 గణనాథునికి, 6,000 బ్రహ్మకు, 6,000 హరికి, 6,000 హరునకు, 1,000 జీవాత్మకు, 1,000 గురువునకు, 1,000 పరమాత్మకు ఇలా జపాన్ని నివేదించాలి.

అద్యదిన సూర్యోదయమారభ్య శ్వః సూర్యోదయ పర్యంతం మయా కృత ఉచ్ఛ్వాస నిశ్వాసాభ్యాం షట్ శతాధికం ఏకవింశతి సహస్ర సంఖ్యాకం అజపా జపం యథాభాగం నివేదయామి

మూలాధారపీఠస్థితాయ సిద్ధలక్ష్మీసమేతాయ గం గణపతయేనమః షట్ శతం నివేదయామి

స్వాధిష్ఠానమంటపస్థితాయ సరస్వతీసమేతాయ అం బ్రహ్మణేనమః షట్ సహస్రం నివేదయామి

మణిపూరకమంటపస్థితాయ లక్ష్మీసమేతాయ ఉం విష్ణవేనమః షట్ సహస్రం నివేదయామి

అనాహతమంటపస్థితాయ గౌరీ సమేతాయ మం రుద్రాయనమః షట్ సహస్రం నివేదయామి

విశుద్ధమంటపస్థితాయ అవిద్యాసహితాయ జిం జీవాత్మనేనమః సహస్రం నివేదయామి

ఆజ్ఞాచక్రమంటపస్థితాయ విద్యాసహితాయ పం పరమాత్మనేనమః సహస్రం నివేదయామి

సహస్రదళకమల కర్ణికాపీఠమధ్యస్థితాయ చిచ్ఛక్తి సహితాయ గుం గురవేనమః సహస్రం నివేదయామి